శ్రీరామ

# నిత్య పితృ తర్పణము

నిత్యము ఒక బ్రాహ్మణుని అర్చించి అర్ఘ్య ఆవాహన పిండ ప్రదానములు లేకుండా భోజనము పెట్టుటను నిత్యశ్రాద్ధమందురు. దీనిలో కర్తకు కానీ, భోక్తకు కానీ మళ్లీ భోజనము చేయకూడదు, బ్రహ్మచర్యము వహించ వలెను అనెడి నియమములు లేవు. ఇది చేయుటకు అవకాశము లేకున్నచో పితృదేవతలనుద్దేశించి జల తర్పణమైననూ చేసినచో అది పితృయజ్ఞ మగును. నిత్య పితృతర్పణమునందు తిలలు వాడనవసరం లేదు. వసురూపం, రుద్రరూపం అంటూ ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. ఇది ఇంటి లోపలకాక, బయట నేలపై దర్భలు పరిచి చేయాలి.

ఆచమ్య। ఓం కేశవాయ స్వాహ్ । ఓం నారాయణాయ స్వాహ్ । ఓం మాధవాయ స్వాహ్।

ఓం గోవిందాయ నమః। ఓం విష్ణవే నమః। ఓం మధుసూదనాయ నమః। ఓం త్రివిక్రమాయ నమః। ఓం వామనాయ నమః। ఓం శ్రీధరాయ నమః। ఓం హృషీ కేశాయ నమః। ఓం పద్మ నాభయ నమః। ఓం దామోదరాయ నమః। ఓం సంకర్షణాయ నమః। ఓం వాసుదేవాయ నమః। ఓం ప్రద్యుమ్నాయ నమః। ఓం అనిరుద్ధాయ నమః। ఓం పురుషోత్తమాయ నమః। ఓం అధోక్షజాయ నమః। ఓం నారసింహాయ నమః। ఓం అచ్యుతాయ నమః। ఓం జనార్దనాయనమః। ఓం ఉపేంద్రాయ నమః। ఓం హరయే నమః। ఓం శ్రీ కృష్ణాయ నమః।।

పవిత్రం ధృత్వా|| ( దర్భతో చేసిన పవిత్రమును ధరించాలి)

పునరాచమ్య|| ( మరల ఆచమనము చేయాలి )

<u>భూతోచ్చాటన</u> : ఉత్తిష్ఠంతు భూత పిశాచాః యేతే భూమి భారకాః। యేతేషామవిరోధేన బ్రహ్మ కర్మ సమారభే।। ( నీరు వాసన చూసి ఎడమ భుజము వైపు వెనుకకు విసరాలి)

<u>ప్రాణా యామము</u> : ఓం భూః ।ఓం భువః। ఓగ్ం సువః। ఓం మహః। ఓం జనః। ఓం తపః। ఓగ్ం సత్యం। ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి। ధియోయోనః ప్రచోదయాత్। ఓమాపోజ్యోతీరసోమృతం బ్రహ్మ భూర్భు వస్సు వరోమ్।। ( అని మనసులో జపిస్తూ ప్రాణా యామము చేయాలి )

<u>సంకల్పం</u> : ( హైదరాబాద్ లో ఉండే వారికి మాత్రమే ఈ సంకల్పం పనికి వస్తుంది. క్రింద గీత ఉన్నవి మీరుఉన్న ప్రదేశాన్ని బట్టి మారాతాయి. కనుక మిగతా ప్రదేశాల వారు మీ ప్రాంత పురోహితులని సంప్రదించగలరు )

మమోపాత్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిశ్య శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం। శ్రీ గోవింద గోవింద గోవింద। శ్రీ మహా విష్ణో రాజయా। ప్రవర్తమానస్య। అద్య బ్రహ్మణః। ద్వితీయ పరార్ధే। శ్వేతవరాహ కల్పే। వైవస్వత మన్వంతరే। కలియుగే। ప్రథమ పాదే। <u>జంబూ ద్వీపే। భరత వర్షే। భరత ఖండే। మేరోర్దక్షిణ దిగ్భాగే। శ్రీశైలస్య వాయువ్యప్రదేశే। క్రిష్ణా గోదావర్యోర్మధ్యదేశే</u>। సమస్త దేవతా బ్రాహ్మణ హరి హర గురు చరణ సన్నిధౌ। అస్మిన్ వర్తమాన - వ్యావహారిక చాంద్రమానేన - ...................... సంవత్సరే। ...........ఆయనే। ...........ఋుతౌ। ......... మాసే। .........పక్షే। .............తిథౌ। ........ వాసరే శ్రీవిష్ణు నక్షత్రే। శ్రీవిష్ణు యోగే ।శ్రీవిష్ణు కరణ । ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభ తిథౌ।

శ్రీరామ

# నిత్య పితృ తర్పణము

ప్రాచీనావీతి|| ( యజ్ఞోపవీతమును ఎడమ నుండి కుడి భుజము పైకి మార్చుకొనవలెను )

అస్మత్ పితౄణాం అక్షయ్య పుణ్యలోకా వాప్త్యర్థం నిత్యశ్రాద్ధ ప్రతినిధి సద్యః నిత్య పితృతర్పణం (సవ్యం) కరిష్యే|
( అని సవ్యం చేసుకుని నీరు వదలాలి. సవ్యమనినప్పుడు ఎడభుజము పైనకు యజ్ఞోపవీతమును మార్చవలెను.)

ప్రాచీనావీతి|| యజ్ఞోపవీతమును కుడి భుజము పైకి మార్చవలెను. దక్షిణముఖముగా తిరిగి, ఎడమ మోకాలు క్రింద ఆన్చి తర్పణ విడువలెను. మొదటి ఖాళీలో గోత్రమును, రెండవ చోట వారి పేరును చెప్పి తర్పణ చేయాలి. "స్వధానమస్తర్పయామి" అన్నప్పుడల్లా మూడుసార్లు ఉదకము పితృతీర్థముగా ( కుడి అరచేతిలో నీరుపోసుకుని చేతిని కుడివైపు వంచి చూపుడు వేలు-బొటన వేలు మధ్యగుండా ఆనీటిని వదులుతూ ) ఇవ్వవలెను. నిత్య పితృతర్పణమునందు తిలలు, రూపం అవసరం లేదు. వారి భార్యకూడా లేనట్లైతే సపత్నీకం అని, స్త్రీల విషయమున భర్త కూడా లేనట్లైతే సభర్తృకం అని చేర్చుకొనవచ్చును. ప్రతీ దానికీ ముందు "అస్మత్" అను శబ్దాన్ని చేర్చ వలెను. బ్రాహ్మణులైతే శర్మాణం అన్నది పనికొస్తుంది కానీ రాజులైతే వర్మాణం,వైశ్యులైతే గుప్తం, ఇతరులు దాసం అనీ మార్చి పలకాలి.

1. పితరం ( తండ్రి ) .................... గోత్రం ............................................. శర్మాణం స్వధానమస్తర్పయామి||3||
2. పితామహం ( తాత ) .................... గోత్రం ........................................ శర్మాణం స్వధానమస్తర్పయామి||3||
3. ప్రపితామహం ( ముత్తాత ) .............. గోత్రం ...................................... శర్మాణం స్వధానమస్తర్పయామి||3||
4. మాతరం ( తల్లి ) ....................... గోత్రాం ............................................. పదాం స్వధానమస్తర్పయామి||3||
5. పితామహీం ( నాయనమ్మ ) ................. గోత్రాం .................................. పదాం స్వధానమస్తర్పయామి||3||
6. ప్రపితామహీం ( ముత్తమ్మ ) ................ గోత్రాం ................................... పదాం స్వధానమస్తర్పయామి||3||
7. సాపత్నీ మాతరం ( సవతి తల్లి ) ........... గోత్రాం .................................... పదాం స్వధానమస్తర్పయామి||3||
8. మాతామహం ( తల్లి తండ్రి ) ...................... గోత్రం ........................... శర్మాణం స్వధానమస్తర్పయామి||3||
9. మాతుః పితామహం ( తల్లి తాత ) ......... గోత్రం ................................ శర్మాణం స్వధానమస్తర్పయామి||3||
10. మాతుః ప్రపితామహం ( తల్లి ముత్తాత ) ........ గోత్రం .......................... శర్మాణం స్వధానమస్తర్పయామి||3||
11. మాతామహీం ( అమ్మమ్మ ) ............ గోత్రాం ...................................... పదాం స్వధానమస్తర్పయామి||3||
12. మాతుః పితామహీం ( తల్లికి నానమ్మ) .......... గోత్రాం ............................ పదాం స్వధానమస్తర్పయామి||3||
13. మాతుః ప్రపితామహీం ( తల్లికి ముత్తమ్మ) ......... గోత్రాం ........................ పదాం స్వధానమస్తర్పయామి||3||
14. ఆత్మపత్నీం ( తనభార్య ) ............ గోత్రాం ............................................ పదాం స్వధానమస్తర్పయామి||3||
15. సుతం ( కుమారుడు ) ............... గోత్రం ........................................... శర్మాణం స్వధానమస్తర్పయామి||3||
16. జ్యేష్ఠ/కనిష్ఠ భ్రాతరం(సోదరులు)........ గోత్రం ................. శర్మాణం (సపత్నీకం) స్వధానమస్తర్పయామి||3||


రాజశేఖరుని విజయ్ శర్మ, rajasekharuni.vijay@gmail.com, CELL NO : 9000532563

# నిత్య పితృ తర్పణము

17. జ్యేష్ఠ/కనిష్ఠ పితృవ్యం(తండ్రి సోదరులు)....... గోత్రం ......... శర్మాణం (సపత్నీకం) స్వధానమస్తర్పయామి||3||

18. మాతులం ( మేనమామ ) ........... గోత్రం ...................... శర్మాణం (సపత్నీకం) స్వధానమస్తర్పయామి||3||

19. దుహితరం ( కుమార్తె ) ............. గోత్రాం ............................................ పదాం స్వధానమస్తర్పయామి||3||

20. భగినీం ( తోబుట్టువు ) .............. గోత్రాం ............................................. పదాం స్వధానమస్తర్పయామి||3||

21. దౌహిత్రం(కూతురి కొడుకు) ............. గోత్రం .................. శర్మాణం (సపత్నీకం) స్వధానమస్తర్పయామి||3||

22. భాగినేయకం ( మేనల్లుడు ) ........... గోత్రం ................... శర్మాణం (సపత్నీకం) స్వధానమస్తర్పయామి||3||

23. పితృభగినీం ( మేనత్త ) ............... గోత్రాం ............................ పదాం (సభర్తృకం) స్వధానమస్తర్పయామి||3||

24. మాతృభగినీం(తల్లి తోబుట్టువు) ............. గోత్రాం ….................. పదాం (సభర్తృకం) స్వధానమస్తర్పయామి||3||

25. జామాతరం ( అల్లుడు ) ........... గోత్రం ............................................. శర్మాణం స్వధానమస్తర్పయామి||3||

26. భావుకం ( బావగారు ) .................... గోత్రం ..................................... శర్మాణం స్వధానమస్తర్పయామి||3||

27. స్నుషాం ( కోడలు ) ...................... గోత్రాం ....................................... పదాం స్వధానమస్తర్పయామి||3||

28. శ్వశురం ( భార్య తండ్రి ) .................... గోత్రం .................................. శర్మాణం స్వధానమస్తర్పయామి||3||

29. శ్వశ్వాం (భార్య తల్లి ) ...................... గోత్రాం ....................................... పదాం స్వధానమస్తర్పయామి||3||

30. శ్యాలకం(భార్య సోదరుడు) ............. గోత్రం ................... శర్మాణం (సపత్నీకం) స్వధానమస్తర్పయామి||3||

31. స్వామినం(ప్రభువు) ......... గోత్రం .......................... శర్మాణం పం (సపత్నీకం) స్వధానమస్తర్పయామి||3||

32. గురుం(గురువు) .............. గోత్రం ............................... శర్మాణం (సపత్నీకం) స్వధానమస్తర్పయామి||3||

33. రిక్థినం( ధనమిచ్చినవారు ) ............ గోత్రం .................. శర్మాణం (సపత్నీకం) స్వధానమస్తర్పయామి||3||

యజ్ఞోపవీతమును నివీతిగా వేసుకుని ముడిని నీటిలో ముంచి నేలపై పిండుచూ క్రింది విధంగా చదువవలెను.

||శ్లో|| యేకే చాస్మత్ కులే జాతాః అపుత్రా గోత్రిణో మృతాః| తే గృహ్ణంతు మయాదత్తం సూత్ర నిష్పీడనోదకం||

( నాకులములోను, గోత్రమునందును పుత్రులు లేక మరణించిన వారందరూ నేను వదిలే ఈ ఉదకమును స్వీకరించెదరు గాక! )

శ్రీరామ రామ రామ|| అనుచూ యజ్ఞోపవీతపు ముళ్లను కళ్లకద్దుకుని సవ్యము చేసుకొనవలెను.